





# శతకాలు

## భక్తి,జ్ఞాన,నీతి

# శూన్య లింగ శతకం





## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020050016422

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్థం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| • Rashtrapati Bhavan<br>• CMU-Books<br>• Sanskrit<br>• TTD,Tirupathi<br>• Kerala Sahitya Akademi | • INSA | • Times of India<br>• Indian Express<br>• The Hindu<br>• Deccan Herald<br>• Eenadu<br>• Vaartha | • Tamil Heritage Foundation<br>• AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

**Subject**

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

**Language**

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

“దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం” అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన ‘ఇచ్ఛ’ (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. “నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది” అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

శ్రీ సీతారామాంజనేయ సంవాద

సారసంగ్రహ రూప

# శ్రీ శూన్యలింగ శతకము




గ్రంథకర్త

ఓలేటి సుబ్బారాయుడు

*(Head clerk, L. F. Sub Dn. Office)*

COCANADA.

కాకినాడ.



మొదటికూర్పు 1000 ప్రతులు.

శ్రీ మారుతి ముద్రానిలయమందు

ముద్రితము

అమలాపురం.


 [*Price 0-1-0.*

# ప్రార్థ ౧.



సీ॥ నను నేల భయమేల ? ♦ నయశీల ! రావేల ?
కటికి చీకటి మూల ♦ గ్రాలనేల ?
జాగేల దయనేల ? ♦ జయశీల యిది లీల ?
ధీగుహాలో వెలి ♦ డాగనేల ?
బరువేల విడనేల ? ♦ కరిపాల బిరుదేల ?
పలువేసములదాల్చి ♦ ప్రబలనేల ?
పగయేల మరుగేల? ♦ పశుపాల యిది మేల ?
యొంటరివై నిల్చి ♦ యొదుగనేల ?

గీ॥ బ్రోవచలమేల యీ వేళ ♦ రోసమేల ?
మానమభిమానములు లేక ♦ మనగనేల ?
పలుకవేల ? శ్రీలోల ! నన్ దలపవేల ?
సహజరాజయోగానంద ♦ జలధిలోల ! ॥

సీ॥ శ్రీరామ యనినిన్నుఁ ♦ బ్రేమబిల్చెదనన్న
నామరూపంబులు ♦ నాస్తికన్న
వైకుంఠనిన్గాంచి ♦ వర్ధిల్లెదనటన్న
లోకాళితోఁబొత్తు ♦ నీకుసున్న
కానుకల్ నీకిచ్చి ♦ ఘనతకెక్కెదనన్న
కామాదివాసనల్ ♦ కల్లయెన్న
భక్తితోడుతనీకు ♦ బ్రణమిల్లెదనటన్న
నొకచోటనుచులేదు ♦ యునికిగన్న !
పాహిమాంయనినిన్ను ♦ బ్రార్థించెదనటన్న
గలలోనివార్తయే ♦ తలపులన్న
సీతమ్మతోఁజెప్పి ♦ చెంతజేరెదనన్న
తలపదునామాట ♦ గలియనిన్ను

౪॥ నీవునన్నట్లు గాచెదో ♦ నిర్వికార
నయనపథచార ! రాగాది ♦ భయవిదూర !
త్రిపురసంహార ! యోవీర ! ధీరధీర !
భౌమశబ్దార్థ సువిచార ! స్వావిహార ! ॥

---

శ్రీసద్గురుచరణారవిందాభ్యాంనమః

# శ్రీ శూన్యలింగశతకము.



గీ॥ శ్రీరమావయోవి ♦ శేష సుఖామృత
పానరక్తుడగుచు ♦ మేనుమఱచు
చిత్స్వరూపమూర్తి ♦ శ్రీపతిశ్రీలిచ్చు
సుభగపుష్ప భృంగ ♦ శూన్యలింగ । 1

## తారక యోగము.

గీ॥ పూజలెన్నియైనఁ ♦ వాఁ జేయవచ్చును
భక్తి లేకయున్నఁ ♦ బత్రిచేటు
భక్తిగలుగుపూజ ♦ పరమపదమునిచ్చు
సుభగపుష్పభృంగ ♦ శూన్యలింగ । 2

గీ॥ కర్మఁజేయువాఁడు ♦ గానడుముక్తిని
గలుగుచిత్తశుద్ధి ♦ కర్మముననుఁ
జ్ఞానమార్గసరణి ♦ సద్గురుఁగానరే
సుభగపుష్పభృంగ ♦ శూన్యలింగ ॥ 3

గీ॥ మూర్తినొక్కదాని ♦ ముందుగానిడుకొని
చిత్తమందునిల్పి ♦ శివునిఁగొలువ
మూర్తి విడిచిమూల ♦ మూర్తి తానౌనయా
సుభగపుష్పభృంగ ♦ శూన్యలింగ ॥ 4

గీ॥ అణుమహాత్స్వరూప ♦ మరియనీవౌదువు
నీదు మహిమలెన్న ♦ నెవరితరము
శ్రుతులుకూడనిన్ను ♦ నుతియింపఁజాలవ
సుభగపుష్పభృంగ ♦ శూన్యలింగ ॥ 5

గీ॥ చిత్తశుద్ధియున్నఁ ♦ జిత్తంపు నవికృతి
కామరోషతతులఁ ♦ గలియకుంట
చిత్తశుద్ధిగాంచి ♦ శివుని సేవింపరే
సుభగపుష్పభృంగ ♦ శూన్యలింగ ॥ 6

గీ॥ మూర్తిగొలిచియైన ♦ ముద్రిలఁగనియైన
యోగసరణినైన ♦ యుక్తినైన
చిత్తశుద్ధిగల్గి ♦ శివుని సేవింపరే
సుభగపుష్పభృంగ ♦ శూన్యలింగ ॥ 7

గీ॥ చిత్రిచిత్రికళలు ♦ చిత్రవిభ్రమణముల్
పండువెన్నెలతుఁగి ♦ నిండియున్న
రూపులేనికళను ♦ రూపించిగనరాదె
సుభగపుష్పభృంగ ♦ శూన్యలింగ ॥ 8

గీ॥ నాదసూత్రిమెఱుఁగు ♦ నాణెమౌధీయోగి
వట్టిధ్వనులువిన్న ♦ ఫలమదేమి?
నాదలయమునందు ♦ మోదించినిలువరే
సుభగపుష్పభృంగ ♦ శూన్యలింగ ॥ 9

గీ॥ బిందుతత్త్వమందుఁ ♦ పెద్దలుబుద్ధిని
వ్యక్తమవనిస్థితిని ♦ బఱఁగుచుండు
బుద్ధినధిగమించి ♦ పూర్ణులై యుండరే
సుభగపుష్పభృంగ ♦ శూన్యలింగ ॥ 10

గీ॥ యోగమనగఁజెల్లు ♦ యోనిలింగైక్యంబు
చిత్తసూఢిగాంచ ♦ శివునిఁజేరు
వివిధయోగచయము ♦ బెక్కుబాధలచేటు
సుభగపుష్పభృంగ ♦ శూన్యలింగ ॥ 11

గీ॥ సారహీనమందుఁ ♦ సంసారమదియేమొ !
సారసారమంచుఁ ♦ జేరలేక
సమరసైక్యపదవి ♦ సారంబుకాదుకో
సుభగపుష్పభృంగ ♦ శూన్యలింగ ॥ 12

గీ॥ స్త్రీనిజూచినంతఁ ♦ జిత్తంబుచలియించు
సహజగుణముమాన్ప ♦ శంభుతరమె?
యిరువురొక్కరౌట ♦ పరగనద్వైతంబు
సుభగపుష్పభృంగ ♦ శూన్యలింగ ॥ 13

గీ॥ హింసలేనిక్రతువు ♦ నెందుఁజూచినఁగాని
మరునిక్రతువుకన్న ♦ మారులేదు
ఆత్మయజ్ఞమన్న ♦ నరియరదేలకో
సుభగపుష్పభృంగ ♦ శూన్యలింగ॥ 14

గీ॥ సతియుఁబతియుఁగూడి ♦ సంసారమొనరింత్రు
సతికిఁబతియెగాక ♦ గతియెలేదు
సతినిగూడముక్తి ♦ సతివీడఁబంధమా
సుభగపుష్పభృంగ ♦ శూన్యలింగ॥ 15

గీ॥ హఠముదిటముగాంచ ♦ నష్టసిద్ధులుగల్గు
యోగమభ్యసించి ♦ భోగమూడిగి
మనసుచిక్కఁబట్టి మహిమచూపఁగనేమి ?
సుభగపుష్పభృంగ ♦ శూన్యలింగ॥ 16

గీ॥ ముక్తిగాంచనున్న ♦ యుక్తియొక్కటికద్దు
పెక్కుత్రోవలెల్లఁ ♦ జిక్కుగాదె
సహజరాజయోగ ♦ సారంబెముక్తియా
సుభగపుష్పభృంగ ♦ శూన్యలింగ॥ 17

సాంఖ్యయోగము.

గీ॥ సృష్టిజాడలెల్ల ♦ సృష్టికర్తయెఱుంగు
శ్రుతులుభిన్నరీతి ♦ నుతులుసేయు
లేనిదానినెట్లు ♦ లెక్కింప భయమేమి ?
సుభగపుష్పభృంగ ♦ శూన్యలింగ॥ 18

గీ॥ సృష్టిఁదెలియఁ బెక్కు ♦ చిక్కులు పడనేల
స్థూలసూక్ష్మములని ♦ చూడరాదె
రెంటిమించియున్న ♦ వెంటనే మోక్షంబు
సుభగపుష్పభృంగ ♦ శూన్యలింగ ॥ 19

గీ॥ స్థూలసూక్ష్మభేద ♦ సూత్రిమొక్కటికద్దు
గానఁబడుట మఱియుఁ ♦ గానఁబడమి
స్థూలమందుఁ జగము ♦ సూక్ష్మంబె తత్త్వంబు
సుభగపుష్పభృంగ ♦ శూన్యలింగ ॥ 20

గీ॥ ఉన్నదానినుండి ♦ యుత్పత్తియగుగాని
శూన్యమందుసృష్టి ♦ చూచుటెట్లు ?
తల్లిదండ్రిలేక ♦ తనయవర్గములున్నె ?
సుభగపుష్పభృంగ ♦ శూన్యలింగ ॥ 21

గీ॥ మొదలుతుదియులేని ♦ మొద్దొకటిజనించె
మొద్దుమిగులనంచు ♦ దద్దరిల్లు
తెలియుదోఁక లేక ♦ తెన్నెట్లుమిగులురా
సుభగపుష్పభృంగ ♦ శూన్యలింగ ॥ 22

గీ॥ తన్ను నెఱుఁగకుంట ♦ తమమంచువచియింత్రు
సృష్టికది యెముూల ♦ జీవమంట
చట్టురాతికేడ ♦ సంతతిగల్గురా
సుభగపుష్పభృంగ ♦ శూన్యలింగ ॥ 23

గీ॥ మూఁడునై మగూఁడి ♦ ముజ్జగంబులుగల్గు
మూఁడుమూర్తులేలు ♦ మూఁటి నెప్పుఁడు
మూఁటిపైనవెలుఁగు ♦ మేటివినీశా
సుభగపుష్పభృంగ ♦ శూన్యలింగ ॥ 24

గీ॥ కార్యజగముగాదు ♦ కారణాత్మయుఁగాదు
చెప్పనలవికాదు ♦ చిత్రమేమొ ?
తెచ్చుకొన్నముండ ♦ త్రిప్పలు వెట్టదా
సుభగపుష్పభృంగ ♦ శూన్యలింగ ॥ 25

గీ॥ దేహమందుఁజొచ్చి ♦ దేహభావముఁదాల్చి
దేవబుద్ధివీడ ♦ జీవుఁడౌను
తన్నుఁదానెఱిఁగినఁ ♦ దానెపో దేవుండు
సుభగపుష్పభృంగ ♦ శూన్యలింగ । 26

గీ॥ ఈశజీవులంచు ♦ నిద్దరేకంబంచు
మాయకన్నదంము ♦ కూయుచుండ్రు
జీవదేవులుండఁ ♦ జిత్రమీశుఁడెవఁడో ?
సుభగపుష్పభృంగ ♦ శూన్యలింగ । 27

గీ॥ ఇంటిలోనిమనుజుఁ ♦ డిల్లు వెడలిపోవ
నిల్లువొంటనఁటి ♦ యేగనట్లు
దేహసాక్షి కేల ♦ దేహవాసలంటు
సుభగపుష్పభృంగ ♦ శూన్యలింగ । 28

గీ॥ ప్రళయకాలమందు ♦ విలయమొందుజగము
సర్వవిలయమందు ♦ సాక్షి వెల్గు
సాక్షి కన్నవాడు ♦ సద్గురుడౌనురా
సుభగపుష్పభృంగ ♦ శూన్యలింగ । 29

గీ॥ సర్వవిలయసాక్షి ♦ సత్యంబు బ్రహ్మంబు
నిత్యవిలయసాక్షి ♦ ప్రత్యగాత్మ
రెంటికైక్యమెట్లో ♦ వెంటనేగనరాదె
సుభగపుష్పభృంగ ♦ శూన్యలింగ ॥ 30

గీ॥ భిన్నవస్తువులకు ♦ వీలుగాదైక్యంబు
సలుపకూడదొక్క ♦ జాతివైన
నైక్యమన్న నెద్ది? ♦ యద్వైతహానియా
సుభగపుష్పభృంగ ♦ శూన్యలింగ । 31

గీ॥ దేహతతులు తాము ♦ దేవుగానగలేవు
తమ్ము నెఱుఁగలేవు ♦ స్థూలగుట
సర్వమెఱుఁగు తనకు ♦ సాక్షియే లేదురా
సుభగపుష్పభృంగ ♦ శూన్యలింగ । 32

గీ॥ ఘటముగన్నవాఁడు ♦ ఘటసాక్షియనియండ్రు
ఘటము తాను నొకటి ♦ గాదు దలప
దేహసాక్షియన్న ♦ దేహంబు తానౌనె
సుభగపుష్పభృంగ ♦ శూన్యలింగ । 33

గీ॥ చేయువాఁడొకండు ♦ చేయఁజూచునొకండు
చూచుచున్నవాఁడె ♦ చూవెసాక్షి
తానుగాక లేదు ♦ తానెట్లు సాక్షియౌ
సుభగపుష్పభృంగ ♦ శూన్యలింగ ॥ 34

గీ॥ చూచునదియు; చూపు; ♦ చూడఁగబడునది
దృక్కు; దృష్టి; మఱియు ♦ దృశ్యమగును
మూటివిడిచియున్న ♦ మోక్షంబె తథ్యంబు
సుభగపుష్పభృంగ ♦ శూన్యలింగ ॥ 35

గీ॥ దృక్కుచూడఁ గన్ను ♦ దృశ్యంబె విషయంబు
రెంటినడుమనుండు ♦ గంటి దృష్టి
మూటికన్న పరుడు ♦ మోహింపఁగాఁడొకో
సుభగపుష్పభృంగ ♦ శూన్యలింగ ॥ 36

గీ॥ దృక్కు దృశ్యమన్నఁ ♦ దొక్కటపడనేల
సూక్ష్మబుద్ధిచేతఁ ♦ జూడరాదె
దృక్కు బ్రహ్మమౌను ♦ దృశ్యంబె జగమౌను
సుభగపుష్పభృంగ ♦ శూన్యలింగ ॥ 37

గీ॥ సర్వమున్నవేళ ♦ సర్వంబుఁ దాఁగాంచు
లేనివేళఁ దాను ♦ లేమిఁ గాంచు
సర్వదృక్కు తానె ♦ సర్వసాక్షియుఁదానె
సుభగపుష్పభృంగ ♦ శూన్యలింగ ॥ 38

గీ॥ వ్యక్తినొక్కదాని ♦ నమ్మ యత్తయటందురి
పెక్కుపేళ్ళు తెలుపు ♦ నొక్కదాని
దృక్షుసాక్షులెల్ల ♦ దెలుపవే బ్రహ్మంబు
సుభగపుష్పభృంగ ♦ శూన్యలింగ ॥ 39

గీ॥ దేహమందునుండు ♦ దేహభాగములకు
వేరువేరుపేళ్లు ♦ వెలసియుండె
తనకుఁ బేరులేదు ♦ తానెట్లు దేహమా
సుభగపుష్పభృంగ ♦ శూన్యలింగ ॥ 40

గీ॥ దేహతతులఁగూడి ♦ దేహయాత్రసలుపుఁ
గలిసి నడువకున్నఁ ♦ గాంచుటెట్లు?
తాను గాంచకున్నఁ ♦ దానెట్లు సాక్షియా
సుభగపుష్పభృంగ ♦ శూన్యలింగ ॥ 41

గీ॥ సర్వమగయువాఁడు ♦ సర్వంబుతోఁగూడు
దండయంకుఁ దాఁడు ♦ దనరు కరణి
తనకు పరుడులేడు ♦ తానెట్లు సంగియా
సుభగపుష్పభృంగ ♦ శూన్యలింగ ॥ 42

గీ॥ సర్వజగముగూడి ♦ సంచరించెడివాఁడు
సర్వమందునిండి ♦ సర్వమగును
తనకుఁ బరములేదు ♦ తానెట్లు పరుడౌను
సుభగపుష్పభృంగ ♦ శూన్యలింగ ॥ 43

గీ॥ సర్వమందు నిండి ♦ సర్వపూర్ణుండైన
తానఖండమూర్తి ♦ యౌను జుమ్ము
తనకుపాధిలేదు ♦ తానెట్లు భిన్నుడౌ
సుభగపుష్పభృంగ ♦ శూన్యలింగ ॥ 44

గీ॥ తాను పూర్ణుఁడైనఁ ♦ దానేకమూర్తియై
త్రివిధకాలములను ♦ దేజరిల్లు
కాలనియతిలేదు ♦ కాలరూపమె తాను
సుభగపుష్పభృంగ ♦ శూన్యలింగ । 45

గీ॥ మూడువేళలందు ♦ మూడుదేహములుండు
మూటియందునుండు ♦ మేటి తానె
మూడులేనివేళ ♦ బూర్ణుఁడై తానుండు
సుభగపుష్పభృంగ ♦ శూన్యలింగ । 46

గీ॥ దేహమందు మఱియు ♦ దేహియందొక భంగి
తానెతానె యుంచుఁ ♦ దగఁ జరించుఁ
దాను దేహిగాక ♦ తాఁ దేహమెట్లౌను
సుభగపుష్పభృంగ ♦ శూన్యలింగ । 47

గీ॥ సర్వమందునిండి ♦ సర్వంబుఁ దానేలు
స్థితియు గతియు రెండు ♦ చెదరకుండ
తానసంగుఁడౌటఁ ♦ దానెట్లు కర్తయౌ
సుభగపుష్పభృంగ ♦ శూన్యలింగ । 48

గీ॥ దేశమెల్లనిండి ♦ దేవుండు వెలయఁగా
దేవుఁ గానలేరు ♦ తెలివి మాలి
కంటిలోని నలుసు ♦ కాఁబోలు గానరు
సుభగపుష్పభృంగ ♦ శూన్యలింగ ॥ 49

గీ॥ ఆత్మకాదటంచు ♦ నఖిలంబు కడఁద్రోసి
త్రోయుసాధనంబు ♦ తుదకుఁ ద్రోసి
త్రోయఁజాలకున్న ♦ దొడ్డవస్తువె సత్తు
సుభగపుష్పభృంగ ♦ శూన్యలింగ ॥ 50

గీ॥ దేహమింద్రియములు ♦ ధీమనోఽహంకార
చిత్తపవనచయము ♦ చేష్టలుడిగి
విలయమొందగాను ♦ వెలసియున్నదె సత్తు
సుభగపుష్పభృంగ ♦ శూన్యలింగ ॥ 51

గీ॥ భ్రాంతిసర్వముడుగ ♦ గ్రాఁలు రజ్జుకరణి
సకలజీవభాస ♦ సమసిపోవ
మిగిలి వెల్గుచున్న ♦ మేటియే సత్తౌను
సుభగపుష్పభృంగ ♦ శూన్యలింగ ॥ 52

గీ॥ శోకమోహపాప ♦ సుఖదుఃఖకోటులున్
కులము నామరూప ♦ గోత్రితతులు
మతము తనువులెల్ల ♦ గతమైనఁగను సత్తు
సుభగపుష్పభృంగ ♦ శూన్యలింగ ॥ 53

గీ॥ సకలదృశ్యరాశి ♦ జడమగుట నేగాంతు
సకలవిలయమునకు ♦ సాక్షినౌదు
సాధనంబులేమి ♦ స్వప్రకాశుడనౌదు
సుభగపుష్పభృంగ ♦ శూన్యలింగ ॥ 54

గీ॥ పరులు తనకులేరు ♦ పరులకుఁ దానౌను
గాంచు సాధనంబు ♦ గాంచు తాను
తన్ను గాంచువాఁడు ♦ తెగలేమి చిత్తౌను
సుభగపుష్పభృంగ ♦ శూన్యలింగ ॥ 55

గీ॥ పుడమి దుఃఖరాశి ♦ పోఁజూతు నెప్పుడు
నిత్యసుఖముగాంచ ♦ నెమురుజూతు
పరమసుఖుఁడనౌట ♦ నిరుపమానందమా
సుభగపుష్పభృంగ ♦ శూన్యలింగ ॥ 56

గీ॥ ద్వైతమున్నచోట ♦ వంత దప్పకయుండు
ద్వైతశూన్యమైన ♦ దనరు సుఖము
సుషుప్తియందుజూడ ♦ సుఖరూపమే తాను
సుభగపుష్పభృంగ ♦ శూన్యలింగ ॥ 57

గీ॥ ఆలుబిడ్డలెన్న ♦ నాత్మకు శేషంబు
తనదు ప్రీతికొఱకు ♦ దానుగోరు
ద్వైతశూన్యుఁడౌట ♦ తానెట్లు శేషియౌ
సుభగపుష్పభృంగ ♦ శూన్యలింగ ॥ 58

గీ॥ భోగ్యవస్తురాశి ♦ భోగమాత్రింబిచ్చు
సకలరాశి కేది ♦ సత్యపదవి
స్వప్నమందు రతులు ♦ సల్పు వనితమాడ్కి
సుభగపుష్పభృంగ ♦ శూన్యలింగ ॥ 59

గీ॥ భోగ్యమౌను జగము ♦ భోక్తయే జీవుండు
రెంటినడుమ భోగ ♦ మంటియుండు
త్రిపుటిశూన్యమైన ♦ దీపించు బ్రహ్మంబు
సుభగపుష్పభృంగ ♦ శూన్యలింగ ॥ 60

గీ॥ తండ్రియున్న వేళఁ ♦ దనయునిసుతుఁడండ్రు
తండ్రిలేని వేళఁ దనయుఁడనరు
భోగ్యరాశిమిథ్య ♦ భోక్తయేలేదు రా
సుభగపుష్పభృంగ ♦ శూన్యలింగ ॥ 61

గీ॥ సంగియైనవాఁడు ♦ చర్చింపభోక్తయౌ
సావయవమునందు ♦ సంగముండు
తాను నిరవయవుఁడు ♦ తానెట్లుభోక్తయౌ
సుభగపుష్పభృంగ ♦ శూన్యలింగ ॥ 62

గీ॥ సత్తు చిత్తు సుఖము ♦ సకలంబు తానయౌ
మూఁడుమూఁడు కావు ♦ మూఁడు నొకటె
స్వగతభేదమెద్ది ♦ శబ్దభేదమె గాని
సుభగపుష్పభృంగ ♦ శూన్యలింగ ॥ 63

గీ॥ గుణముతోడ గుణిని ♦ గొమరొప్ప గాంతుము
గుణమునొక్కదానిఁ ♦ గనుట లేదు
తనకు గుణము లేదు ♦ తానెట్లు గుణియౌను
సుభగపుష్పభృంగ ♦ శూన్యలింగ । 64

గీ॥ తినదు పిలఁబొంది ♦ తాఁగని పిల్లను
తల్లిఁ బిల్లగూడిఁదా ♦ జరించి
తల్లిపిల్లగాక ♦ తగనున్న ధన్యుండు
సుభగపుష్పభృంగ ♦ శూన్యలింగ । 65

అమనస్కయోగము.

గీ॥ మానసంబుచేతఁ ♦ గానవచ్చు జగంబు
మనసుగలియకున్నఁ ♦ గనుట లేదు
మనసుగాక చూడ ♦ ఘనదృశ్యజాలంబు
సుభగపుష్పభృంగ ♦ శూన్యలింగ । 66

గీ॥ మనసు మనసటంచు ♦ జనులెల్ల వచియింత్రు
మనసుగన్నవారు ♦ మహిని లేరు
లేనిదానిఁజూచి ♦ పూని బ్రిమయనేల
సుభగపుష్పభృంగ ♦ శూన్యలింగ । 67

గీ॥ వృత్తియున్నదన్న ♦ వృత్తిమత్తుండును
లేదటన్న నదియు ♦ లేకయుండు
రెండులేనివేళ ♦ నుండు మనస్సాక్షి
సుభగపుష్పభృంగ ♦ శూన్యలింగ । 68

గీ॥ మనమె వృత్తిమత్తు ♦ మనముసాక్షి యెతాను
రెండునేకమైన ♦ నుండుబోధ
బోధతానయైన ♦ బాధేమిదెల్పరా
సుభగపుష్పభృంగ ♦ శూన్యలింగ ।     69

గీ॥ దినముదినమునందు ♦ తేజరిల్లుసుషుప్తి
జన్మజన్మమధ్య ♦ చావువెలయు
సుప్తిమృతులయందు ♦ శోధింపబ్రహ్మంబె
సుభగపుష్పభృంగ ♦ శూన్యలింగ ॥     70

గీ॥ సుప్తిమృతులయందుఁ ♦ జూడజాడ్యంబుండు
సహజపదవియందు ♦ జాడ్యమేది ?
సహజరాజయోగ ♦ సారరూపమెతాను
సుభగపుష్పభృంగ ♦ శూన్యలింగ ।     71

గీ॥ మాయలేనిదంట ♦ మగడుబ్రహ్మంబంట
జగముగన్నదంట ♦ చాలుఁజాలు
చెవులపిల్లికొమ్ము ♦ చిక్కెనా సాధింప
సుభగపుష్పభృంగ ♦ శూన్యలింగ ।     72

గీ॥ వివిధభూషలందు ♦ వెలయుబంగారంబు
పసిడిగాక లేదు ♦ వస్తుచయము
జగము వేఱుకాదు ♦ జగమంతిబ్రహ్మంబె
సుభగపుష్పభృంగ ♦ శూన్యలింగ ।     73

గీ॥ తనదునిద్రయందుఁ ♦ దగవెల్గుస్వప్నంబు
తన్నుమించితోఁప ♦ భిన్నమగున?
తానుగన్నజగము ♦ తనకెట్లు భిన్నమౌ
సుభగపుష్పభృంగ ♦ శూన్యలింగ॥ 74

గీ॥ బ్రహ్మమందుఁబుట్టి ♦ బ్రహ్మమందడఁగును
జలధియందుబుట్టు ♦ నలలుమాడ్కి
బ్రహ్మకంటెజగము ♦ పరికింపగా లేదు
సుభగపుష్పభృంగ ♦ శూన్యలింగ॥ 75

గీ॥ బ్రహ్మమందుజగము ♦ భాసించుమిథ్యయై
పూర్ణమందుసున్న ♦ పొసఁగుభాతి
తానఖండసచ్చి ♦ దానందపూర్ణుడౌ
సుభగపుష్పభృంగ ♦ శూన్యలింగ। 76

గీ॥ దేహమందుముక్తి ♦ దేహాంతమునముక్తి
దేహమందుఁజూడ ♦ దెలియురెండు
నేలవిడుచుసాము ♦ నిరుపయోగంబురా
సుభగపుష్పభృంగ ♦ శూన్యలింగ। 77

గీ॥ బంధమున్నవాఁడు ♦ పరుగెత్తుముక్తికై
నిత్యముక్తుడైన ♦ నేతతాను
బంధమెవరికోయి ♦ పరుగెత్తనేటికి?
సుభగపుష్పభృంగ ♦ శూన్యలింగ। 78

గీ॥ తన్నుఁబరము రెంటిఁ ♦ దాఁగాంచని దెముక్తి
తన్ను దానుగనని ♦ తావెముక్తి
తానుదానటంచుఁ ♦ దగఁగాంచ ముక్తుఁడౌ
సుభగపుష్పభృంగ ♦ శూన్యలింగ। 79

గీ॥ సుప్తియందుసుఖము ♦ శోభిల్లఁబరమేది ?
యన్యమెవనిచేత ♦ నరయబడియె
భ్రాంతినాశమైన ♦ బ్రహ్మంబెబయలౌను
సుభగపుష్పభృంగ ♦ శూన్యలింగ। 80

గీ॥ వెల్తురున్నచోట ♦ వెలయదుచీకఁటి
యంధకారమేది ? ♦ యాగతంబు
జ్ఞానరూపుతాను ♦ తానెట్లయజ్ఞుడౌ
సుభగపుష్పభృంగ ♦ శూన్యలింగ। 81

గీ॥ సారసారమెద్ది ? ♦ జ్ఞానరూపంబెద్ది ?
యాదికాదియెద్ది ? ♦ యఖిలమెద్ది ?
యెద్దిబుద్ధినడపు ♦ నద్దియేబ్రహ్మంబు
సుభగపుష్పభృంగ ♦ శూన్యలింగ। 82

గీ॥ విషయజాలమందు ♦ విషయవాసనలందు
నాసతోడఁగూడి ♦ రోసివీడి
నిత్యపదవినున్న ♦ నిశ్చలయోగియౌ
సుభగపుష్పభృంగ ♦ శూన్యలింగ। 83

గీ॥ ఇంద్రియమనసాదు ♦ లెటవిహరింపవో
కామజాలమెచట ♦ గానరాదో
దుఃఖమెచటలేదో ♦ తోరంబువిజనమో
సుభగపుష్పభృంగ ♦ శూన్యలింగ ॥ 84

గీ॥ విషయశూన్యమైన ♦ వెలయుదుజ్ఞానంబు
జ్ఞానమున్నచోట ♦ జ్ఞాతయుండు
మూఢులేనిచోట ♦ మోదించుమౌనివై
సుభగపుష్పభృంగ ♦ శూన్యలింగ ॥ 85

గీ॥ కన్నవారినెల్ల ♦ గామించువ్యభిచారి
కోర్కెతోడనుండు ♦ గూఢచారి
కోర్కెలేకమసలి ♦ కుల్కుచుండదెసాధ్వి
సుభగపుష్పభృంగ ♦ శూన్యలింగ ॥ 86

గీ॥ సహజపదవిదోఱకు ♦ సద్గురుకరుణచే
గురువుజేరకున్న ♦ గూలు జలధి
తనకుశిష్యుడేడి ♦ తానెట్లుగురువౌను
సుభగపుష్పభృంగ ♦ శూన్యలింగ ॥ 87

గీ॥ తనువుమానధనము ♦ లనిశంబునర్పించి
గురువుకరుణగాంచి ♦ గురునిజేరి
గురుడుతానెయైన ♦ గోడువేమిదెల్పరా!
సుభగపుష్పభృంగ ♦ శూన్యలింగ ॥ 88

గీ॥ సతతమాత్మదృష్టి ♦ సంచరించుతనకు
మావసేంద్రియములు ♦ మసలెనేని
తద్వికారచయము ♦ తవులునేజింతింప
సుభగపుష్పభృంగ ♦ శూన్యలింగ । 89

గీ॥ విషయదోసమరసి ♦ విడువవై రాగ్యమూ
దిరుగఁగోరకుండు ♦ టరయఫలము
తనకునిత్యతృప్తి ♦ తానేలగోరును ?
సుభగపుష్పభృంగ ♦ శూన్యలింగ ॥ 90

గీ॥ శ్రవణసాధనంబు ♦ సమకూర్చుసద్బోధ
తిరుగబ్రమయాకుంట ♦ దీనిఫలము
పూర్ణమయుడుతాను ♦ పోనేలసాధింప ?
సుభగపుష్పభృంగ ♦ శూన్యలింగ । 91

గీ॥ యోగతతులచేత ♦ యోగించునుపరతి
స్వస్వరూపమైన ♦ శాంతిఫలము
యోగరూపుతాను ♦ యోగసాధనమేల ?
సుభగపుష్పభృంగ ♦ శూన్యలింగ ॥ 92

గీ॥ తలపనీశుడౌను ♦ తత్పదవాచ్యంబు
జీవులెల్లగూడ ♦ జెలగునేత
తత్పరుండజుండు ♦ తత్పదలక్ష్యంబు
సుభగపుష్పభృంగ ♦ శూన్యలింగ । 93

గీ॥ తతమనోచయంబు ♦ త్వంపదవాచ్యంబు
చిత్తజాలమెల్ల ♦ చేష్టలుడుగ
దృష్టయైనయాత్మ ♦ త్వంపదలక్ష్యంబు
సుభగపుష్పభృంగ ♦ శూన్యలింగ ॥ 94

గీ॥ వాచ్యలక్ష్యములకు ♦ ప్రబలదయైక్యంబు
వాచ్యమెల్లవిడిచి ♦ పైనిలక్ష్య
మొకటిగాగనెఱిగి ♦ యుండుటసిపదంబు
సుభగపుష్పభృంగ ♦ శూన్యలింగ ॥ 95

గీ॥ బ్రహ్మమెఱుఁగువాఁడు ♦ బ్రహ్మంబెయగుఁ
బ్రహ్మవిదుఁడటంచుఁ ♦ బలుకరాదు [గాని
నీవునేనులేని ♦ నిల్కడేబ్రహ్మంబు
సుభగపుష్పభృంగ ♦ శూన్యలింగ । 96

గీ॥ అఖిలమంచుతాను ♦ యఖిలంబుతనయందు
నఖిలశూన్యమైన ♦ నాడుతాను
యఖిలమున్నసాక్షి ♦ నంచెంచుశాడ్యోగి
సుభగపుష్పభృంగ ♦ శూన్యలింగ ॥ 97

గీ॥ అచలయోగియయ్యు ♦ ననివ్యాపారముల్
వెసనెఱపుచుగాంచు ♦ విమలసుఖము
పరపురుషునిపొందు ♦ వాంఛించుస్త్రీభంగి
సుభగపుష్పభృంగ ♦ శూన్యలింగ ॥ 98

గీ॥ సకలనిగమరూప ♦ సారసంగ్రహమూర్తి
యంగలింగరూప ♦ లింగమూర్తి
సకలహృదయగమ్య ♦ చైతనసత్కీర్తి
సుభగపుష్పభృంగ ♦ శూన్యలింగ॥ 99

గీ॥ ఆశ్రితజనరక్ష ♦ జ్ఞానందసుముఖాంగ
నిజసులభసుఖజల ♦ నిఖితరంగ
ద్వయరహితశుభాంగ ♦ భావవర్జితసంగ
సుభగపుష్పభృంగ ♦ శూన్యలింగ॥ 100

గద్య.

ఇది శ్రీపరమేశ్వరీ పరమేశ్వరైక్య స్వరూప భూత విద్వదనుభవసిద్ధ సహజామనస్క రాజయోగసారామృత నిరంతర పానానంద విరాజిత నిముసక వివంశ పారావార రాకాసుధాకర శ్రీ మల్లపరాజామాత్య శేఖర శ్రీమత్సద్గురు చరణారవింద కరుణాకటాక్ష లబ్ధజ్ఞాన, ఓలేటి వంశపవిత్ర శ్రీసూర్యనారాయణ మంత్రిపుత్ర శేషమాంబాశుక్తి ముక్తాఫల సుబ్బరాయ విరచిత శ్రీ సీతారామాంజనేయ సంవాద సారసంగ్రహరూప శ్రీ శూన్యలింగ శతక రాజంబు సర్వంబు శ్రీపరదేవతార్పణమస్తు. శ్రీశ్రీశ్రీ